

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీనిగమాంత దేసికాయనమః

# అభీతిస్తవమ్



శ్రీరంగనాథస్వామి, శ్రీరంగం




'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అఝగ శింగరాచార్యులు


సమర్పణ: మొలుగు వేంకటాచార్య, తిరుచనూరు

వంగల వేంకట కేశవ అయ్యంగారు



తిరునారాయణ స్వామి, మేల్కోట



శ్రీవేదాంతదేసికులు

# అభీతిస్తవమ్

ఈస్తుతిలోమొత్తం 29 శ్లోకాలున్నాయి. భయనివారణకోసం ప్రార్థించిన స్తుతి కనుక దీనికీ పేరు వచ్చింది. దేశికులు శ్రీరంగంలో చిరకాలం వేంచేసి ఉండి, శ్రీరంగనాథుని సేవించి, గ్రంథప్రవచనాన్ని చేశారు. అపుడు ఆ క్షేత్రంలో మహమ్మదీయుల దండయాత్రలవల్ల చాలా భయం కలిగింది. మహమ్మదీయుల సేనలు శ్రీరంగంలో ప్రవేశించి, అక్కడ చాలా నష్టాన్ని కలుగజేశాయి. అక్కడ ఉండే పెద్దలు శ్రీరంగనాథుని మూలమూర్తి ఎదుట అడ్డు గోడను కట్టి దానిని కనుపించకుండా చేసి, కాపాడారు. ఉత్సవమూర్తిని ఉపాయంతో వెంట తీసికొని, తిరుమలప్రాంతంలో రక్షించారు దేశికులు శ్రీరంగనాథుడు లేని శ్రీరంగంలో ఉండలేక అక్కడనుండి వేరొక చోటుకు వెళ్ళిపోయారు. వారు తిరునారాయణపురంలో ఉండగా, శ్రీరంగనాథుని విశ్లేషానికి చాలా బాధపడి, ఈ అభీతిస్తవమనే గొప్ప స్తుతిని రచించారు. శ్రీరంగనాథునకు నిత్యారాధనాదులు నిలచిపోవడం, ఉత్సవమూర్తిని శ్రీరంగంనుండి వేరొక చోటుకు తీసికొని పోవలసిరావడం మొదలైన ఉపద్రవాలను తలచినపుడు దేశికులకు కలిగిన మనఃక్లేశం చాలా ఎక్కువ. ఆ రీతిలో శ్రీరంగంలో ఏర్పడిన ఆపదను పూర్తిగా తొలగించి అభయం కలిగించాలని, వేరొక చోటికి తరలిపోయిన ఉత్సవమూర్తి తిరిగి శ్రీరంగానికి వేంచేసేటట్లు, ఆరాధనాదులు యథాపూర్వం జరిగేటట్లు అనుగ్రహించమని దేశికులు ఇందులో శ్రీరంగనాథుని ప్రార్థించారు. దేశికుల ఈ ప్రార్థన ఫలించగా. శత్రుబాధ తీరింది. గోపన్న అనే బాగవతోత్తముడు ఉత్సవమూర్తిని శ్రీరంగానికి తిరిగి తీసికొనివచ్చాడు. రంగనాథుని కైంకర్యాలు పూర్వంవలె జరిగాయి. ఈ సంగతిని తెలిసికొన్న దేశికులు సంతోషించి, శ్రీరంగానికి తిరిగి వచ్చి, రంగనాథుని కళ్ళార సేవించి, ఆనందించారు. ఈ స్తుతిని భక్తిశ్రద్ధలతో పఠించినవారికి ఏ భయమైనా తప్పక తీరుతుంది. వారి అభీష్టాన్ని శ్రీరంగనాథుడు తప్పక అనుగ్రహిస్తాడు. –అనేది నిశ్చయం.

★★★★★

# అభీతిస్తవమ్

1) అభీతిరిహ యజ్జుషాం యదవధీరితానాం భయం,
భయాభయవిధాయినో జగతి యన్నిదేశేస్థితాః 1
తదేతదతిలఙ్ఘితద్రుహిణశమ్భుశక్రాదికం
రమాసఖమధీమహే కిమపిరఙ్గధుర్యం మహః 11

ఈ లోకంలో శ్రీరంగనాథుని సేవించేవారికి ఏ భయం కలుగదు. అతడు దూరం చేసినవారికి భయం కలుగుతున్నది. లోకంలో భయాన్ని, అభయాన్ని కలిగించేవారు ఆ శ్రీరంగనాథుని ఆజ్ఞలో అణగి ఉన్నారు. అటువంటి మహిమను కలిగినవాడు, బ్రహ్మరుద్రేంద్రాదుల కంటే అధికుడు, లక్ష్మీదేవితో కూడినవాడు, శ్రీరంగనిర్వాహకుడు, మన కంటికి సాక్షాత్కరించేవాడైన శ్రీరంగనాథుడనే అద్వితీయమైన తేజస్సును అనుసంధిస్తున్నాము.

2) దయా శిశిరితాశయా సదా మే మనసి జాగ్రయుః
శ్రియాధ్యుషితవక్షసఃశ్రితమరుద్వృధా సైకతాః1
జగద్దురిత ఘస్మరాజలధిడిమ్భ డమ్భస్పృశః
సకృత్ప్రణతరక్షణ ప్రథిత సంవిదః సంవిదః 11

కరుణవల్ల మనసులో చల్లగా ఉండేవి, లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో కలిగినవి, కావేరీనదీతీరంలోని సైకతప్రాంతంలో ఉన్నవి, లోకంలోనివారి పాపాలను పోగొట్టేవి, చిన్న సముద్రంవలె తోచేవి, ఒక్కసారి నమస్కరించినవారిని కాపాడడంలో లోకప్రసిద్ధమైన ప్రతిజ్ఞను కలిగినవి అయిన భగవదవతారాలు నా. మనసులో సదా స్థిరంగా నిలచి ఉండాలి

3) యదద్యమితబుద్ధినా బహుళమోహభాజా మయా
గుణగ్రథితకాయవాఙ్మనసవృత్తివైచిత్ర్యతః 1

**అతర్కిత హితాహితక్రమవిశేషమారభ్యతే**
**తదప్యుచితమర్చనం పరిగృహాణ రజ్గేశ్వర ll**

శ్రీరంగనాథా!అల్పజ్ఞానాన్ని కలవాడనై, చాలా మోహాన్ని కలవాడనైన నేను. సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలతో బంధింపబడిన శరీరం, వాక్కు, మనస్సు అనే మూడు కరణాలతో చేసే ప్రవృత్తులు పలు విధాలుగా ఉన్నందున, ఏ ప్రవృత్తిని నేను ఇపుడు మంచి చెడ్డలను చూడకుండా చేస్తున్నానో, ఆ కార్యాన్ని నీ ఆరాధనారూపంగా నీవు పరిగ్రహించాలి.

**4) మరుత్తరణిపావక త్రిదశనాథ కాలాదయః**
**స్వకృత్యమధికుర్వతే త్వదపరాదతో బిభ్యతః l**
**మహత్కిమపివజ్రముద్యతమివేతి యచ్ఛ్రూయతే**
**తరత్యనఘ తద్భయం య ఇహ తావకస్తావకః ll**

దోషాలు లేని శ్రీరంగనాథా!నీపట్ల అపరాధానికి జంకినవారైన వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, యముడు మొదలైన దేవతలు పైకెత్తబడిన వజ్రాయుధంవంటి నీకు భయపడి తమ తమ కృత్యాలను నిర్వహిస్తున్నారు–అనే ఏ భీతి వేదాలలో వినబడుతున్నదో, ఆ భయాన్ని ఈ లోకంలో నిన్ను సేవించేవారికి కలుగదు.

**5) భవన్తమిహ యస్స్వధీనియత చేతనాచేతనం**
**పనాయతి నమస్యతి స్మరతి వక్తి పర్యేతి వా l**
**గుణం కమపి వేత్తి వా తవ గుణేశ గోపాయితుః**
**కదాచన కుతశ్చన క్వచన తస్య న స్యాద్భయమ్ ll**

(గొప్ప)గుణాలకు ఆశ్రయమైనవాడా!నీ సంకల్పంతో చేతనాచేతనాలను నియమించే నిన్ను ఈ లోకంలో ఎవడు స్తుతిస్తున్నాడో, నమస్కరిస్తున్నాడో,

ధ్యానిస్తున్నాడో, నీ నామానుసంధానాన్ని చేస్తున్నాడో, లేక, ప్రదక్షిణం చేస్తున్నాడో, రక్షకుడవైన నీ గుణాలలో ఏదయినా ఒక గుణాన్ని తెలిసికొంటున్నాడో, అతనికి ఏ క్షణంలోను ఎవనివల్ల ఏ విధమైన భయం కలుగదు.

6) స్థితే మనసి విగ్రహే గుణిని దాతు సామ్యే సతి
స్మరేదఖిలదేహినం య ఇహ జాతుచిత్త్వామజమ్1
తయైవ ఖలు సన్ధయా తమథ దీర్ఘనిద్రావశం స్వయం
విహితసంస్మృతిర్నయసి ధామనైశ్శ్రేయసమ్ 11

ఈ లోకంలో ఎవడు తన మనస్సు తన స్వాధీనంలో ఉండేటపుడు, శరీరం మంచి గుణాలను కలిగి ఉన్నపుడు, ధాతువులు సమమైన స్థితిలో ఉండేటపుడు అన్నిటికి అంతర్యామివై, జన్మ లేనివాడవై ఉండే నిన్ను ఒకసారి ప్రపత్తి చేస్తున్నాడో, తరువాత ఆయుస్సు పూర్తి అయినపుడు మరణానికి చిక్కుకొన్న అతనికి అతడు పూర్వం చేసిన స్మృతికారణంగానే తగిన స్మృతిని కలిగించి, ముక్తికి తగిన స్థానానికి అతనిని చేరుస్తావు.

7) రమాదయిత రఙ్గభూరమణ కృష్ణ విష్ణో హరే
త్రివిక్రమ జనార్దన త్రియుగనాథ నారాయణ 1
ఇతీవ శుభదాని యః పఠతి నామధేయాని తే
న తస్య యమవశ్యతా నరకపాతభీతిః కుతః 11

లక్ష్మీవల్లభా!శ్రీరంగంలో ఆనందంతో వేంచేసి ఉండేవాడా!కృష్ణా!అంతటా వ్యాపించి ఉండేవాడా!పాపాలను పోగొట్టేవాడా! త్రివిక్రమా! జనార్దనా!ఆరు గుణాలను కలవాడా!నాథా! నారాయణా!—అని ఈ విధమైన, మంచిని కలిగించే నీ

తిరునామాలను ఎవడు అనుసంధిస్తాడో, అతనికి యమునివల్ల బాధ కలుగదు. ఇక నరకభయం ఎక్కడ కలుగుతుంది?

8) కదాచిదపి రఙ్గభూరసిక యత్ర దేశే వశీ
త్వదేకనియతాశయస్త్రిదశ వన్దితో వర్తతే ।
తదక్షత తపోవనం తవ చ రాజధానీ స్థిరా
సుఖస్య సుఖమాస్పదం సుచరితస్య దుర్గం మహత్ ॥

శ్రీరంగనివాసంలో రాసిక్యాన్ని కలవాడా! ఇంద్రియాలను జయించినవాడై, నీలో నే స్థిరంగా భావాన్ని నిలిపినవాడై, దేవతలకుకూడా నమస్కరించదగిన గొప్పదనాన్ని కలవాడైన భాగవతుడు ఎక్కడ ఒక క్షణమైనా నివసిస్తాడో, ఆ చోటు ఏ అడ్డు లేని తపోవనం. నీకు స్థిరమైన రాజధానికూడా. సుఖాలన్నిటిలో గొప్ప సుఖాన్ని కలిగించే చోటు. పుణ్యానికి గొప్ప కోట.

9)త్రివర్గపథవర్తినాం త్రిగుణలంఘుణోధ్యోగినాం
ద్విషత్ప్రమథనార్థినామపి చ రంగధ్రుశ్యోధయాః।
స్థలత్సమయకాతరీ హరణ జాగరూకాః ప్రభో
కరగ్రహణ దీక్షితాః క ఇవ తే న దివ్యా గుణాః ॥

ప్రభూ!రంగనాథా!శ్రీరంగంలో దర్శన మిచ్చే వాడవైన నీ గొప్ప గుణాలు అన్నీ ధర్మార్థకామాలనే మూడు పురుషార్థాలను కోరేవారికి, సంసారాన్ని దాటి మోక్షాన్ని పొందగోరేవారికి, శత్రువులను జయించగోరేవారికి వారు తడబడే సమయాలలో వారికి కలిగే భయాన్ని తీర్చడంలో మెలకువను కలిగినవై, కరావలంబాన్ని ఇచ్చి రక్షించడంలో దీక్షను కలిగినవి అవుతున్నాయి.

10) బిభేతి భవభృత్ప్రభో త్వదుపదేశ తీవ్రౌషధాత్
కదధ్వ రస దుర్విషే బలిశ భక్షవత్ప్రీయతే l
అపథ్యపరిహారధీ విముఖమిత్థమాకస్మికీ
తమప్యవసరే క్రమాదవతి వత్సలా త్వద్దయా ll

ప్రభూ!సంసారి నీవు చేసిన ఉపదేశమనే కటువైన మందుకు భయపడుతున్నాడు. నీచమార్గాలవల్ల లభించే సుఖాలనే తీవ్రవిషంలో, గాలంలోని ఎరను తినే చేపవలె, ఆనందాన్ని పొందుతున్నాడు. ఈ విధంగా మంచిని కలిగించని దారినుండి తొలగిపోవాలనే అభిప్రాయాన్ని లేని అతనినికూడా వాత్సల్యాన్ని కలిగినది, ఏ కారణం లేకుండా ఏర్పడేదైన నీ కరుణ తగిన సమయంలో క్రమంగా రక్షిస్తున్నది.

11) అపార్థ ఇతి నిశ్చితః ప్రహరణాది యోగస్తవ
స్వయం వహసి నిర్భయస్తదపి రఙ్గ పృథ్వీధర l
స్వరక్షణమివాభవత్ప్రణతరక్షణం తావకం
యదాత్థపరమార్థవిన్నియతమన్తరాత్మేతి తే ll

శ్రీరంగనాథా!దివ్యాయుధాలు మొదలైనవానిని కలిగి ఉండడం నీకు ఉపయోగం లేనిది –అని నిశ్చయింపబడుతున్నది. అయినా, ఏ భయం లేని నీవు స్వయంగా ఆయుధాదులను ధరిస్తున్నావు? అంటే., నీవు “పరమార్థవిదుడైన జ్ఞాని నాకు ఆత్మ” అని గీతలో అన్నావుకదా! అటువంటి ఆ జ్ఞానులను రక్షించడం నిన్ను రక్షించుకోవడమే అవుతుంది కనుక, నీవు ఆయుధాదులను ధరిస్తున్నావు.

12) లఘిష్ఠసుఖసఙ్గదైస్స్వకృతకర్మనిర్వర్తితైః
కలత్రసుతసోదరానుచరబన్ధుసమ్బన్ధిభిః l

ధనప్రభృతికైరపి ప్రచురభీతి భేదోత్తరైః
న బిభ్రతి ధృతిం ప్రభో త్వదనుభూతి భోగార్థినః ll

ప్రభూ!నిన్ను సదా అనుభవించడమనే మోక్షాన్ని పొందగోరేవారు చాలా అల్పమైన సుఖాలను ఇచ్చేవి, తాము చేసికొన్న కర్మల ఫలంగా వచ్చేవి, మిక్కిలిగా, అనేకవిధాలుగా భయాన్నే కలిగించేవి అయిన భార్య, పుత్రులు, సహోదరులు, పరిచారకులు, బంధువులు మొదలైనవారివల్ల ఆనందాన్ని పొందరు.

13) న వక్తుమపి శక్యతే నరకగర్భవాసాదికం
వపుశ్చబహుధాతుకం నిపుణ చిన్తనే తాదృశమ్l
త్రివిష్టపముఖం తథా దివి పదస్య తే దీవ్యతః
కిమత్ర న భయాస్పదం భవతి రఙ్గపృథ్వీపతే ll

శ్రీరంగనాథా! నరకవాసం గర్భవాసం మొదలైనవి నోటితోకూడా పలుకడానికి సాధ్యం కాని క్లేశాలు. . నిశితంగా గమనిస్తే, పలు ధాతువులు నిండిన శరీరం ఆ విధంగానే చెప్పడానికి వీలు లేనిది. గొప్పగా వెలిగే నీ స్థానమైన వైకుంఠాన్ని భావించినపుడు స్వర్గలోకాదులుకూడా ఆ విధంగానే చాలా నీచమైనవి. వీటిలో ఏది భయాన్ని కలిగించదు?

14) భవన్తి ముఖభేదతో భయనిదానమేవ ప్రభో
శుభాశుభవికల్పితా జగతి దేశ కాలాదయః l
ఇతిప్రచురసాధ్వసే మయి దయిష్యసే త్వం న చేత్
క ఇత్థమనుకమ్పితా త్వదనుకమ్పనీయశ్చకః ll

ప్రభూ! ఈ లోకంలో మంచివి అని, చెడ్డవి అని వర్గీకరింపబడిన దేశకాలాదులన్నీ వేరు వేరు రీతులలో భయాన్ని కలిగించేవిగానే ఉన్నాయి—అని

భయపడే నాపై నీ కరుణను ప్రసరింజేయకపోతే ఈ విధంగా నాపై దయ చూపేవాడు ఇంకొకడు ఎవడు ఉన్నాడు?నీ దయను పొందే యోగ్యతను కలవాడు నాకంటే ఇంకొకడు ఎవడు ఉన్నాడు ?

15) సకృత్ప్రపదనస్పృశామభయదాన నిత్యవ్రతీ
న చ ద్విరభిభాషసే త్వమసి విశ్రుతః స్వోక్తితః ।
యథోక్త కథనం విదుస్తవ తు యాతుధానాదయః
కథం వితథమస్తు తత్కృపణసార్వభౌమే మయి ॥

ఒక్కసారి నిన్ను శరణు పొఃదినవారిని రక్షించడమనే వ్రతాన్ని నీవు కలవాడవని, రెండు మాటలు పలుకవని, నీమాటవల్లనే నీవు ప్రసిద్ధుడవైనావు. చెప్పిన రీతిలోనే చేసే నీ స్వభావాన్ని విభీషణాదిరాక్షసులుకూడా తెలిసికొన్నారు. ఆ విధంగా చెప్పిన రీతిలో చేసే నీ స్వభావం అకించనులలో మొదటివాడనైన నా విషయంలొ ఏ విధంగా వ్యర్థం అవుతుంది? కాదుకదా!

16) అనుక్షణ సముత్థితే దురితవారిధౌ దుస్తరే
యది క్వచన నిష్కృతిర్భవతి సాऽపి దోషావిలా ।
తదిత్థమగతౌమయి ప్రతివిధానమాధీయతాం
స్వబుద్ధి పరికల్పితం కిమపి రఙ్గధుర్య త్వయా ॥

శ్రీరంగనాథా!ప్రతిక్షణం ఉప్పొంగే, దాటడానికి సాధ్యం కాని నాపాపసముద్రంలో ఎక్కడైనా ప్రాయశ్చిత్తం సంభవిస్తే (చేస్తే)అదికూడా దోషాలతో నిండినదై, పాడయిపోతున్నది. అందువల్ల ఏ గతి లేనివాడనైన నా విషయంలో నీ సంకల్పంతో ఏర్పడే, ఏదయినా ఒక ప్రాయశ్చిత్తాన్ని నాకు విధించు.

17) విషాదబహులాదహం విషయనిర్జితో దుర్జయాత్
బిభేమి వృజినోత్తరస్త్వదనుభూతి విచ్ఛేదతః I
మయానియత నాథవానయమితిత్వమర్థాపయన్,
దయాధనజగత్పతే దయిత రఙ్గ సంరక్ష మామ్ II

దయ అనే ధనాన్ని కలవాడా! లోకనాథా! శ్రీరంగవాసాన్ని ఇష్టపడేవాడా! పాపాలు నిండిన నేను పలు విషాదాలతో కూడినవి, జయించడానికి సాధ్యం కానివి అయిన ఈ లోకంలోని సుఖాలవల్ల నీ అనుభవానికి ఆటంకం కలుగుతుందని భయపడుతున్నాను. "ఇతడు నన్నే నాథునిగా కలవాడు" –అనే మాటను నీవు సార్థకం చేస్తూ నన్ను రక్షించు.

18) నిసర్గనిరనిష్టతా తవ నిరంహసః శ్రూయతే
తతస్త్రియుగసృష్టవద్భవతి సంహృతిః క్రీడితమ్ I
తథాऽపి శరణాగత ప్రణయభఙ్గభీతో భవాన్
మదిష్ట మిహ యద్భవేత్ కిమపి మాస్మ తజ్జీహపత్ II

జ్ఞానాదిగుణాలను ఆరింటిని కలవాడా!పాపరహితుడవైన నీకు సహజంగానే దుఃఖరాహిత్యం వేదంలో చెప్పబడింది. అందువల్ల సృష్టివలె లయంకూడా నీకు లీలగా అవుతున్నది. అయినా, శరణు పొందినవాని అభీష్టాన్ని కాదనడానికి భయపడే స్వభావాన్ని కల నీవు ఈ లోకంలో ఏది నాకు ఆశపడడానికి తగినదో దానిని తప్పక అనుగ్రహించు.

19) కయాధుసుత వాయస ద్విరదపుఙ్గవ ద్రౌపదీ
విభీషణ భుజఙ్గమ వ్రజగణామ్బరీషాదయః I
భవత్పదసమాశ్రితా భయవిముక్తి మాపూర్యథా
లభేమహి తథావయం సపది రఙ్గనాథ త్వయా II

అభీతిస్తవమ్

శ్రీరంగనాథా!కయాధుపుత్రుడైన ప్రహ్లాదుడు, కాకాసురుడు, గజేంద్రుడు, ద్రౌపది, విభీషణుడు, కాళియుడు, గోపకులం, అంబరీషుడు మొదలైనవారు నీ శ్రీచరణాలను ఆశ్రయించి ఏ విధంగా అభయాన్ని పొందారో, ఆ రీతిలోనే మేముకూడా వెంటనే నీవల్ల అభయాన్ని పొందాలి.

20) భయం శమయ రఙ్గధామ్న్యనితరాభిలాషస్పృశాం
శ్రియంబహులయ ప్రభో శ్రితవిపక్షమున్మూలయ ।
స్వయం సముదితం వపుస్తవ నిశామయన్తస్సదా,
వయం త్రిదశనిర్వృతిం భువి ముకున్ద విన్దేమహి॥

ప్రభూ! ముకుందా! శ్రీరంగాన్ని తప్ప వేరు దేనినీ కోరని భక్తులకు కలిగిన భయాన్ని తీర్చు. వైష్ణవ సంపదను పెంపొందించు. నీ దాసుల శత్రువులను సమూలంగా నిర్మూలించు. మేము స్వయంవ్యక్తమైన నీ రూపాన్ని సదా సేవిస్తూ నిత్యసూరులు పొందే ఆనందాన్ని ఈ భూమిలోనే పొందుతాము.

21) శ్రియః పరిబృఢే త్వయి శ్రితజనస్య సంరక్షకే
సదద్భుత గుణోదధావితి సమర్పితోऽయం భరః ।
ప్రతిక్షణమతఃపరం ప్రథయ రఙ్గధామాదిషు
ప్రభుత్వమనుపాధికం ప్రథితహేతిభిర్హేతిభిః ॥

శ్రియఃపతివై, నిన్ను శరణు పొందినవారిని రక్షించేవాడవై, గొప్ప, ఆశ్చర్యకరమైన గుణాలకు సముద్రమై ఉండే నీ సన్నిధిలో నా ఈ రక్షణభారం సమర్పింపబడింది. ఇకపై ప్రతిక్షణం గొప్పగా ప్రకాశించే దివ్యాయుధాలతో వేంచేసి ఉండే నీవు నీ ప్రభుత్వాన్ని శ్రీరంగం మొదలైనచోట్ల నడపు.

22) కలిప్రణిధి లక్షణైః కలితశాక్యలోకాయతైః
తురుష్కయవనాదిభిర్జగతిజృమ్భమాణం భయమ్1
ప్రకృష్ట నిజశక్తిభిః ప్రసభమాయుధైః పఞ్చభిః
క్షితి త్రిదశరక్షకైః క్షపయ రఙ్గనాథ క్షణాత్ 11

శ్రీరఃగనాథా!కలిపురుషుని పరివారంవంటివారై, బౌద్ధచార్వాకులతో కూడినవారైన తురుష్కయవనాదులవల్ల లోకంలో ఎక్కువగా పెరిగిపోయే భయాన్ని నీవు గొప్ప శక్తిని కలిగినవి, బ్రాహ్మణులను రక్షించేవి అయిన నీ పంచాయుధాలతో వెంటనే ఒక్క క్షణంలో రూపుమాపాలి.

23) దితిప్రభవదేహభిద్దహనసోమసూర్యాదికె
తమః ప్రమథనం ప్రభో సముదితాస్త్రబృన్దం స్వతః 1
స్వవృత్తి వశవర్తిత త్రిదశవృత్తిచక్రం పునః
ప్రవర్తయతు ధామ్ని తే మహతి ధర్మచక్ర స్థితిమ 11

ప్రభూ!దితి పుత్రులైన అసురుల శరీరాన్ని బద్దలుకొట్టేదై, అగ్ని, చంద్రుడు, సూర్యుడు –అనే ముగ్గురితో కూడినట్లున్నదై, మిగిలిన ఆయుధాలన్నిటికి మూలమై(ప్రధానమై), దేవతల ఉజ్జీవనాన్ని నిర్వహించేదై ఉండే చక్రాయుధంతో నీవు వేంచేసి ఉండే శ్రీరంగంలో ధర్మచక్రస్థితిని సహజంగానే మళ్ళీ నడపాలి.

24) మనుప్రభృతి మానితే మహతి రఙ్గధామాదికే
దనుప్రభవదారుణైర్దరముదీర్యమాణం పరైః 1
ప్రకృష్ట గుణకశ్రియా వసుధయా చ సన్ధుక్షితః
ప్రయుక్తకరుణోదధిః ప్రశమయ స్వశక్త్యా స్వయమ్ 11

అభీతిస్తవమ్

గొప్ప గుణాలను కలవాడా!మనువు మొదలైనవారిచే ఆరాధింపబడిన వైభవాన్ని కల శ్రీరంగం మొదలైన దివ్యదేశాలలో అసురులకంటే ఎక్కువ క్రూరతను కల యవనాదిశత్రువులవల్ల కలిగిన భయాన్ని లక్ష్మీదేవిచే, భూదేవిచే ప్రోత్సహింపబడినవాడవై, నీ కరుణాసముద్రాన్ని ఉపయోగించి, నీ శక్తితో స్వయంగానే ఉపశమింపజేయాలి.

25) భుజఙ్గమ విహఙ్గమ ప్రవర సైన్యనాథాః ప్రభో
తథైవకుముదాదదయో నగరగోపురద్వారపాః ।
అచిన్త్య బలవిక్రమాస్త్వమిహరఙ్గ సంరక్షకా
జితం త ఇతి వాదినో జగదనుగ్రహే జాగ్రతు ॥

ప్రభూ! ఇంతటిది అని మనస్సుతో భావించడానికి సాధ్యం కానిదైన బలాన్ని, వీరకృత్యాలను కలవాడు, సర్పప్రభువైన ఆదిశేషుడు, పక్షి రాజు గరుడుడు, సేనాధిపతి విష్వక్సేనుడు మొదలైనవారు, ఆ విధంగానే, కుముదకుముదాక్షాది గణనాయకులు, నగలపాలకులు, ద్వారపాలకులు, నీవలె, శ్రీరంగాన్ని కాపాడేవారై, నీ విజయాన్ని కీర్తిస్తూ, లోకాన్ని అనుగ్రహించడంలో జాగరూకులై ఉండాలి.

26) విధిస్త్రిపురమర్దనస్త్రిదశపుఙ్గవః పావకో
యమ ప్రభృతయోऽపి యద్విమతరక్షణే న క్షమాః ।
రిరక్షిషతి యత్ర చ ప్రతిభయం న కిఞ్చిత్క్వచిత్,
స నః ప్రతిభటాన్ ప్రభో శమయ రఙ్గధామాదిషు ॥

ప్రభూ! బ్రహ్మ, త్రిపురాంతకుడైన శివుడు, దేవాధిపతి ఇంద్రుడు అగ్ని, యముడు మొదలైన దేవతలు ఎవరూ నీ విరోధిని రక్షించలేరు. నీవు ఎవరినైనా

రక్షించదలిస్తే అతనికి భయాన్ని కలిగించగలిగినది ఏదీ ఎక్కడా లేదు. అటువంటి నీవు శ్రీరంగం మొదలైన చోట్ల ఉండే మా శత్రువులను లేకుండాజేయాలి.

27) స కైటభ తమోరవిర్మధు పరాగజఝ్ఝా మరుత్
హిరణ్యగిరిదారణస్త్రుటిత కాలనేమిద్రుమః 1
కిమత్ర బహునాభజద్భవ పయోది ముష్టింధయః
త్రివిక్రమభవత్క్రమః క్షిపతు మజ్క్షు రజ్గద్విపః 11

మూడు పాదాలతో లోకాలను కొలిచినవాడా! నీ లీల కైటభుడనే చీకటికి సూర్యుడు, మధువనే, అసురరజస్సుకు పెనుగాలి., హిరణ్యకశిపుడనే పర్వతాన్ని పెకలించినది, కాలనేమి అనే వృక్షాన్ని తుంచినది. ఈ విషయంలో పలు మాటలు ఎందుకు?భక్తుల సంసారసముద్రాన్ని పూర్తిగా తాగగలిగినది., అటువంటి నీ లీల శ్రీరంగశత్రువులను వేగంగా నశింపజేయాలి

28) యతి ప్రవరభారతీరసభరేణ నీతం వయః
ప్రఫుల్లపలితం శిరఃపరమిహ క్షమం ప్రార్థయే 1
నిరస్త రిపు సమ్భవే క్వచన రజ్గముఖ్యేవిభో
పరస్పరహితైషిణాం పరిసరేషు మాం వర్తయ 11

ప్రభూ! శ్రీభాష్యకారుల శ్రీసూక్తుల అనుభవంతోనే నా యౌవనం గడచిపోయింది. తల పూర్తిగా తెల్లబడింది. ఇక ఈ లోకంలో నాకు తగిన విషయాన్ని కోరుతున్నాను, శత్రువులు ఏర్పడతారనే సందేహం ఏమాత్రం లేని రీతిలో శ్రీరంగం మొదలైన దివ్యదేశాలలో ఎక్కడో ఒకచోట పరస్పరం మంచిని కోరుకొనేవారి సమీపంలో నేను జీవనం సాగించాలి.

29) ప్రవృద్ధగురు వీక్షణప్రథితవేఙ్కటేశోద్భవాం
ఇమామజయసిద్ధయే పఠత రఙ్గభర్తుస్స్తుతిమ్
భయం త్యజత భద్రమిత్యభిదధత్ శ వః కేశవః
స్వయం ఘనఘృణా నిధిర్ గుణగణేన గోపాయతి ll

గొప్ప జ్ఞానులైన ఆచార్యుల కటాక్షంవల్ల ప్రసిద్ధిని పొందిన వేంకటేశకవి అనే వేదాంతదేశికులు రచించిన ఈ శ్రీరంగనాథుని స్తుతిని ఏ భయం తీరడంకోసమైనా పారాయణం చేయండి. గొప్ప కరుణకు ఆశ్రయమై, "భయాన్ని విడవండి. మీకు క్షేమం కలుగుతుంది" అని పలికిన ఆ స్వామి తన కల్యాణగుణసమూహంతో తానే స్వయంగా మిమ్మల్ని రక్షిస్తాడు.

అభీతిస్తవం సంపూర్ణమ్

★★★★★